# అద్భుతమైన ఎముక

విలియం స్టీగ్, తెలుగు: కె. సురేష్

THE AMAZING BONE

·WILLIAM STEIG·





ఈ రోజు చాలా బాగుంది. అందుకే బడి నుంచి తిన్నగా ఇంటికి వెళ్లకుండా ప్రియ అటూ, ఇటూ తిరుగుతోంది. ఆ పట్టణంలో పెద్దవాళ్లని చూస్తూ ఉంది. ఈ పెద్దవాళ్లు ఏం పనులు చేస్తుంటారు? అతడిని చూడు. బహుశ, ఒక రోజు ఆమె కూడా అలాంటిదే ఏదైనా పని చేస్తుంటుందేమో.




రోడ్డును శుభ్రం చేస్తున్న పారిశుద్ధ్య కార్మికులను చూసింది ప్రియ.

బేకరీలోని ఓవెన్‌లో వేడి, వేడి రొట్టెలు, పంచదార అంటించిన బన్నులు చేస్తున్న వ్యక్తిని చూసింది.



రోడ్డు పక్కన గోదాము దగ్గర ఒక కర్రను పాతి, దానికి తగులుకునేలా గుర్రపు నాడాలు విసురుతూ ఆడుతున్న వాళ్లను చూసింది. వాళ్లల్లో ఒకతను పైపు కాలుస్తున్నాడు.



తరువాత ఆమె బడికీ, ఇంటికీ మధ్యనున్న చిన్న అడవిలో కూర్చుంది. అది వసంత కాలం. అన్నివైపులా రంగురంగుల పూలు ఉన్నాయి. చల్లటి గాలి ఆమెను మెల్లగా తాకుతోంది. తాను కూడా ఒక పువ్వు లాగా మారిపోతానని ఆమెకు అనిపించింది. పూల రేకుల లాగా ఆమె బట్టలు ఆమెకి తేలికగా అనిపించసాగాయి.

'ఇదంతా నాకు ఎంతో బాగుంది,' ఆమె తనలో తాను అనుకుంది.



"నాకు కూడా," ఆమెకు ఎవరివో మాటలు వినిపించాయి. ప్రియ నిటారుగా కూర్చుని అటు, ఇటు చూసింది. ఆమెకు అక్కడ ఎవ్వరూ కనపడలేదు.

"ఎవరది? ఎక్కడ ఉన్నారు?" ఆమె అడిగింది.

"కొంచెం కిందకి చూడు," అన్న జవాబు వచ్చింది. అప్పుడు ప్రియ కిందకి చూసింది. "నేను ఒక ఎముకను. నీ కుడిచేతి వైపు ఉన్న చెట్టు దగ్గర నీలం రంగు పూల మధ్య ఉన్నాను." ప్రియకి అక్కడ ఒక చిన్న ఎముక కనపడింది. "నువ్వు మాట్లాడగలవా?" ఆమె మెల్లగా అడిగింది.

"నేను అన్ని భాషలు మాట్లాడగలను," అంది ఎముక. "స్పానిష్‌లో మాట్లాడమన్నావా? జర్మనీలోనా? అంతేకాదు, అన్ని రకాల గొంతులను అనుకరించగలను."



సైనికులు కవాతు చేసేటప్పుడు మోగించే బాకా శబ్దం చేసింది ఎముక. తరువాత గాలి, వాన పడుతున్నప్పుడు వచ్చే చప్పుళ్లను అనుకరించింది. తరువాత గురక పెట్టింది, తుమ్మింది.

తాను చూస్తున్నది, వింటున్నది ప్రియ నమ్మలేకపోతోంది.

“నవ్వు ఒక ఎముకవి,” ఆమె అంది. “నువ్వు ఎలా తుమ్మగలుగుతున్నావు?”

“నాకు తెలియదు,” ఎముక బదులిచ్చింది. “ఈ ప్రపంచాన్ని నేను తయారు చేయలేదు.”

“మంచి ఎముకా, నిన్ను మా ఇంటికి తీసుకుని వెళ్లనా?” ప్రియ అడిగింది.

“తీసుకెళ్లు,” ఎముక అంది. “నేను ఒంటరిగా ఉన్నాను. ఇంకొక నెలలో నేను ఇక్కడకు వచ్చి ఒక సంవత్సరం అవుతుంది.”



"ఒక మంత్రగత్తె బుట్టలోంచి నేను పడిపోయాను. గట్టిగా అరిస్తే ఆమె నన్ను తీసుకుని వెళ్లేదే. కానీ ఆమె దగ్గర ఉండాలని నాకే లేదు. ఆ మంత్రగత్తె ఏమిటేమిటో చేసేది. రోజు వెల్లుల్లిపాయలు వేసి, పాలకూర వండేది. మోకాళ్ల నెప్పులని ఎప్పుడూ గొణుగుతూ ఉండేది. పిచ్చి పిచ్చి ప్రశ్నలు అడుగుతూ ఉండేది. ఉత్సాహంతో ఉరకలు వేసే నీలాంటి అమ్మాయిలతో ఉండటం నాకు ఇష్టంగా ఉంటుంది."

ఆ ఎముకని తీసుకుని ప్రియ తన పర్స్‌లో పెట్టుకుంది. మాటలు కొనసాగించటానికి దానిని తెరిచే ఉంచింది. ఆ తరువాత ఇంటికి బయలుదేరింది. తన బడి పుస్తకాలను అక్కడ గడ్డిలోనే మరిచిపోయింది.



ఆ ఎముకని అమ్మా నాన్నలకు చూపించాలన్న ఉత్సాహంలో ఉంది. వాళ్లు ఎలా స్పందిస్తారు? ఆ విషయం ప్రియకి బాగా తెలుసు. మాట్లాడే ఎముక గురించి చెబితే, అమ్మ, "అదంతా నువ్వు ఊహించుకుంటున్నావు," అంటుంది. నాన్న తన మాటలు నమ్ముతాడు. అప్పుడు ఎముక మాట్లాడి ఆ ఇద్దరిని ఆశ్చర్యపరుస్తుంది.

వసంతకాల ఎండలో ఆకు పచ్చని ఆకులు మెరుస్తున్నాయి. కప్పల బెకబెకలు వినపడుతున్నాయి.

"ఈ రోజు నిజంగా ఎంతో బాగుంది," ప్రియ చెబుతోంది. నువ్వు నాకు దొరకటం నిజంగా ఆశ్చర్యకరమే."

"నేను నిన్ను ఎలా దొరకబుచ్చుకున్నానో చూశావా!" ఎముక బదులిచ్చింది. తరువాత అది కూనిరాగం తియ్యసాగింది. దాంతో నడకలో అలసట తెలియనే లేదు.

అయితే ఆ సంతోషం ఎంతో సేపు లేదు. ఉన్నట్టుండి ఒక పెద్ద రాయి వెనక నుంచి తుపాకులు, కత్తులతో దొంగలు బయటకు వచ్చారు. ఎవరు వాళ్లు?

వాళ్ల వంటి నిండా బట్టలు, ముఖాలకు మసుగులు ఉండటంతో ప్రియకి ఏమీ అర్థం కాలేదు. కానీ వాళ్లు భయంకరంగా ఉన్నారు, పెద్ద పెద్దగా అరుస్తున్నారు.



“వెంటనే నీ పర్స్ మాకు అప్పగించు!” దొంగలు ఆమెను ఆదేశించారు.

ప్రియ సంతోషంగా తన పర్స్ వాళ్లకి ఇచ్చేసి వెళ్లిపోయి ఉండేదే, కానీ తన ఎముకను వాళ్లకి ఇవ్వాలని లేదు.





“నా పర్స్ మీకు ఇవ్వను,” ప్రియ చెప్పింది. తన ధైర్యానికి ఆమెకే ఆశ్చర్యం వేసింది.
“దానిలో ఏముంది?” ఆమె తలకి తుపాకి గురిపెడుతూ ఒక దొంగ అడిగాడు.





"దానిలో నేను ఉన్నాను!" ఎముక గుర్రుమంది.

తరువాత అది పాము లాగా బుస కొట్టింది, సింహం లాగా గర్జించింది.

అది విన్న దొంగలు అక్కడ ఇంకా ఒక్క క్షణం కూడా ఉండకుండా పరుగులు తీశారు. భయంకరమైన అరుపులు ఇంకేమీ వాళ్లు వినదలుచుకోలేదు. వాళ్లు ఎటుగా పారిపోయారో కూడా తెలియలేదు. అది చూసి ప్రియ నవ్వసాగింది. ఎముక కూడా నవ్వుతోంది.

ఆ తరువాత వాళ్లిద్దరూ ఇంటి వైపుకి నడవసాగారు. జరిగినదాని గురించి దారి పొడవునా మాట్లాడుకుంటూ నవ్వుకుంటున్నారు. అప్పుడు ఒక చెట్టు వెనక నుంచి ఒక తోడేలు వచ్చింది. అది వాళ్ల దారికి అడ్డంగా నిలబడింది. దాని కోటుకి ఒక నీలం రంగు పువ్వు ఉంది. ఒక చేతిలో చేతికర్ర, మరొక చేతిలో టోపీ ఉన్నాయి. దాని పదునైన, తెల్లని కోరలు అందరికీ కనపడేలా అది పెద్దగా నవ్వుతోంది.



“ఆగు,” తోడేలు అరిచింది. భయంతో ప్రియ బిగుసుకు పోయింది. “నీ కోసం ఎంతో కాలంగా వెదుకుతున్నాను,” తోడేలు అంది. “నువ్వు బొద్దుగా, ముద్దుగా ఉన్నావు. ఈ రాత్రికి నిన్ను తింటాను.” ప్రియాని గట్టిగా పట్టుకోటానికి ప్రయత్నించింది.



“ఆ అమ్మాయిని వదిలిపెట్టరా, నీచుడా,” ఎముక అరిచింది, “వదలకపోతే నీ చెవి కోసేస్తాను!”

“ఆ మాట్లాడేది ఎవరు?” తోడేలు ఆశ్చర్యంగా అడిగింది.

“ఆకలిగా ఉన్న మొసలిని. తాజా తోడేలు మాంసం అంటే నాకు చాలా ఇష్టం!” ఎముక బదులిచ్చింది.



కానీ దొంగల లాగా ఆ తెలివైన తోడేలు అంత తేలికగా మోసపోలేదు. దానికి చుట్టుపక్కల భయంకరమైన మొసలి ఏదీ కనపడలేదు. శబ్దం ప్రియ పర్స్ నుంచి వస్తోంది కాబట్టి అది దాంట్లోకి చూసింది. అది ఎముకను పర్స్ లోంచి బయటకు తీసింది. “అరే! ఇది అద్భుతమైన ఎముక! మాట్లాడే ఎముక! ఇటువంటి ఎముక కోసమే నేను వెదుకుతున్నాను.” తోడేలు ఆ ఎముకను తన జేబులో పెట్టుకుంది. ఎముక ఏడ్చింది, గోలగోల చేసింది. కానీ దానివల్ల ఏమాత్రం లాభం లేకపోయింది.



తరువాత ప్రియని లాక్కెళుతూ తన ఇంటివైపుకి బయలుదేరింది తోడేలు. ప్రియ పెద్దగా ఏడ్వసాగింది. ఆమె ఏడ్పు విని తోడేలుకి బాధ వేసింది కానీ రాత్రికి ఆమెను తినాలని ఉంది.



“నా మీద దయ ఉంచండి తోడేలు గారు,” ప్రియ వేడుకుంది, “చనిపోయే ముందు నా ఎముకను నాకు తిరిగి ఇవ్వండి.”

“సరే,” తోడేలు అంది. తన జాలి గుణం మీద తోడేలుకి కోపం వచ్చింది. కానీ చివరికి అది ఎముకను ప్రియకు తిరిగి ఇచ్చింది, ఆమె దానిని తన పర్స్‌లో పెట్టుకుంది.

“ఒక అందమైన అమ్మాయిని చంపకూడదు,” ఎముక అరిచింది. “నీ అకృత్యాలకు నువ్వు సిగ్గుపడాలి!”

తోడేలు నవ్వింది. “నేను ఎందుకు సిగ్గుపడాలి? నేను ఏమిటో అలాగే ఉంటాను. ఈ ప్రపంచాన్ని నేను తయారు చెయ్యలేదు.”

దాంతో తోడేలుని ఎముక తిట్టటం మొదలుపెట్టింది. “నువ్వు పనికిమాలినదానివి!” అంటూ అది అరిచింది. “మురికి కాలవలోని పురుగువి. నీచురాలివి!!”

ఈ తిట్ల దండకం తోడేలుకి ఏమాత్రం నచ్చలేదు. “నువ్వు నోరు మూసుకుని ఉండు. లేకపోతే నిన్ను కూడా తినేస్తాను,” తోడేలు అరిచింది. “మాట్లాడే ఎముకని తినటం భలే బాగుంటుంది. అప్పుడు నువ్వు బాధతో అరుస్తూ ఉంటావు.”



ఇంటికి వెళ్లేవరకు ఇక ఎముక నోరు విప్పలేదు. ప్రియ కూడా ఏమీ మాట్లాడలేదు.



ఇంటికి చేరుకున్న తరువాత ప్రియని ఆమె ఎముకతోపాటు ఒక ఖాళీ గదిలోకి నెట్టి తోడేలు తలుపు వేసేసింది. గోడకేసి చూస్తూ ప్రియ నేల మీద కూర్చుని ఉంది.

"నీకు ఎలా అనిపిస్తోందో నాకు తెలుసు," ఎముక గుసగుసగా అంది.

"నా జీవితం ఇప్పుడే మొదలయ్యింది," ప్రియ గొంతు పెగలటం లేదు. "ఇంత తొందరగా చనిపోవాలని నాకు లేదు."

"నాకు తెలుసు," ఎముక బదులిచ్చింది.

“తప్పించుకోటానికి మనం ఏమీ చెయ్యలేమా?” ప్రియ అడిగింది.

“ఛా! నా బుర్రకి ఏదైనా ఉపాయం తడితేనా,” ఎముక అంది, “కానీ నా బుర్ర ఏమాత్రం పనిచెయ్యటం లేదు. నాకు చాలా బాధగా ఉంది. దుఃఖంగా కూడా ఉంది.”

అప్పుడు వంటింటి లోనుంచి ఏవో శబ్దాలు వినపడసాగాయి. “ఆ శబ్దాలు ఏమిటి?” ప్రియ అడిగింది.

“చాకుకి తోడేలు పదును పెడుతున్నట్టు ఉంది,” ఎముక గుసగుసగా అంది.



“అయ్య బాబోయ్!” ప్రియ ఏడ్వసాగింది. “ఇప్పుడు ఈ శబ్దాలు ఏమిటి?”

“పొయ్యిలో కట్టెలు వేస్తున్నట్టు ఉంది,” ఎముక బదులు ఇచ్చింది.



"నాకు ఇంకా ఎంతో సమయం లేదు," ప్రియ అంది. ఆమెకు నూనె, మసాలా వాసన వస్తోంది. తోడేలు భోజనానికి అన్ని ఏర్పాట్లు చేస్తోంది. భయంతో ప్రియ ఎముకను తన హృదయానికి హత్తుకుంది.

"నా మనస్సుకు శాంతిని ఇచ్చే మాటలు ఏమైనా చెప్పు, ఎముకా."

"నువ్వంటే నాకు ఎంతో ఇష్టం," ఎముక చెప్పింది.

"నువ్వన్నా నాకు ఎంతో ఇష్టం!" ప్రియ బదులు ఇచ్చింది. అప్పుడు ఆమెకు తలుపు తెరుస్తున్న చప్పుడు వినిపించింది. ఇక ఆమె గొంతులోంచి మాట పెగల్లేదు. తలుపు వైపుకి చూసే ధైర్యం కూడా ఆమెకు లేకపోయింది.



"ధైర్యంగా ఉండు," ఎముక గుసగుసలాడింది. కానీ ప్రియ భయంతో గజగజ వణికిపోతోంది.

తోడేలు ఆమెను పట్టుకుని వంటింట్లోకి తీసుకుని వెళ్లింది. అక్కడ మంట కణకణమని మండుతోంది.



"నిన్ను ఇలా చెయ్యటం నాకు బాధగా ఉంది," తోడేలు పెద్దగా నిట్టూర్చింది. "నువ్వంటే నాకు ఎటువంటి వ్యక్తిగత ద్వేషం లేదు."



**"ఛిబ్బం!"** ఉన్నట్టుండి ఎముక అరిచింది. అలా ఎందుకు అరిచిందో దానికి కూడా తెలియదు.

"ఆ శబ్దం ఏమిటి?" గాభరా పడుతూ అడిగింది తోడేలు.

**"ఇబ్బం సిబ్బిల్!"** మళ్లీ గట్టిగా అరిచింది ఎముక. **"జిబరిక్ సిబ్బిల్ దిగరే!"** అప్పుడు అనుకోకుండా ఒక వింత జరిగింది. తోడేలు చాలా చిన్నగా అయిపోయింది!

"**అలాబం చినూక్ బేబో చిప్ గిబో జిల్**!" ఎముక తన శబ్దాలను ఆపలేదు. దాంతో తోడేలు కాస్తా కుందేలంత అయిపోయింది. జరిగినది ఎవరూ – ప్రియా కానీ, తోడేలు కానీ, ఎముక కానీ – నమ్మలేకపోతున్నారు.

కానీ ఇదంతా ఎముక శబ్దాల వల్లనే అయ్యింది.



**"అదూనిస్ ఇస్గూలక్ కీబోక్కిస్ ఇబ్బప్!"** మంత్రాల లాంటి శబ్దాలను ఎముక కొనసాగిస్తూనే ఉంది.

అప్పుడు తోడేలు కాస్తా ఎలకంత అయిపోయింది.

**"స్క్రబ్బూనిత్!"** ఎముక ఆదేశం జారీ చేసింది. అది వింటూనే ఎలకంత అయిపోయిన తోడేలు కలుగులోకి దూరింది.



“నీకు మాయలు, మంత్రాలు తెలుసని నాకు చెప్పలేదే!” గట్టిగా ఊపిరి వదులుతూ అడిగింది ప్రియ. “ఇప్పటిదాకా నాకు కూడా తెలియదు,” ఎముక చెప్పింది.

“మరి, ఆ శబ్దాలు నువ్వు ఎలా నేర్చుకున్నావు?”

“అదే నాకు కూడా తెలియటం లేదు,” ఎముక చెప్పింది. “అవి నా నోట్లోంచి అలా ఊడిపడ్డాయంతే. ఆ మంత్రగత్తె తోపాటు ఉండి, ఉండి ఆ మాటలు నా బుర్రలోకి చొచ్చుకుని పోయినట్లున్నాయి.”

“నువ్వు నిజంగా అద్భుతమైన ఎముకవి,” ప్రియ మెచ్చుకుంది, “నేను ఈ రోజుని జీవితంలో ఎన్నటికీ మరిచిపోలేను.”



ప్రియ ఇంటికి చేరుకునేసరికి చీకటి పడిపోయింది. ఇంటి తలుపులు తెరవగానే ఆమె తల్లి గట్టిగా కౌగిలించుకుంది. తండ్రి కూడా ఆమెను హత్తుకున్నాడు.

"నువ్వు ఎక్కడ ఉన్నావు?" తెలుసుకోవాలన్న ఆదుర్దా ఇద్దరిలోనూ కనపడుతోంది. "నీ గురించి ఆలోచిస్తూ మేం దిగులుగా ఉన్నాం."



ప్రియ ఏం చెబుతుంది? ఎక్కడ మొదలు పెట్టాలో ఆమెకు అర్థం కాలేదు. తరువాత ఆమె ఎముకను చేతిలోకి తీసుకుంది. "ఈ ఎముక మాట్లాడగలదు!" ప్రియ చెప్పింది. "బాగుంది, మాట్లాడే ఎముకా? ప్రియా, మళ్లీ కట్టుకథలు చెబుతున్నావా," ప్రియ ఊహించినట్లుగానే వాళ్ల అమ్మ అంది. నాన్న కూడా అలాంటిదే ఏదో అన్నాడు. "మీ అమ్మాయి చాలా తెలివైనది!" ప్రియ ఊహించినట్లుగానే ఎముక మాట్లాడి వాళ్లని ఆశ్చర్యచకితుల్ని చేసింది.

వాళ్లు ఆ స్థితిలోంచి తేరుకోక ముందే ఆ రోజు జరిగిన వింత, వింత సంఘటనలన్నింటినీ ప్రియ వాళ్లకి వివరించింది. ఎముక తనని కాపాడిన విధానం గురించి కూడా చెప్పింది. ప్రియ వాళ్ల అమ్మా, నాన్నలకు ఇవన్నీ నమ్మశక్యంగా అనిపించ లేదు. మెల్లగా వాటన్నింటిని జీర్ణం చేసుకున్నారు.



కాలక్రమంలో ఆ ఎముక ఆ కుటుంబంలో ఒక భాగం అయ్యింది. పెద్ద బల్ల మీద వెండి పళ్లెంలో దానికి గౌరవప్రదమైన స్థానాన్ని కల్పించారు. నిద్రపోయేటప్పుడు ప్రియ ఆ ఎముకను తనతో తీసుకుని వెళ్లేది. కమ్మని పాటలు పాడుతూ, కథలు చెబుతూ ప్రియని ఎముక నిద్ర పుచ్చేది.

ఇంటిలో ఎవరైనా ఒంటరిగా ఉంటే వాళ్లతో మాట్లాడటానికి ఎముక ఎప్పుడూ సిద్ధంగా ఉండేది. కావాలనుకున్నప్పుడల్లా అది చక్కని సంగీతం వినిపించేది. ఒక్కొక్కసారి దానికి మనసు లేకపోయినా సంగీతం వినిపించాల్సి వచ్చేది!



కెల్‌డికోట్ బహుమతి పొందిన పుస్తకం